శ్రీ పరమేశ్వరాయనమః

దివ్యవాణీసుకృతిప్రాసాదము. 13వ సుకృతి.

# అవతార మీమాంస

గ్రంథకర్త:

ముదిగొండ మల్లికార్జునరావు

ప్రకాశకులు:

దివ్యవాణీ సుకృతిప్రాసాదము

శికింద్రాబాదు

సోల్ ఏజన్సీ:

శ్రీ రామా బుక్ డిపో

మార్కెట్‌స్ట్రీటు, శికిందాబాదు



వెల 0-6-0

# మనవి

ఈ "అవతార మీమాంస" యను గ్రంథము యశః కాయ ముదిగొండ మల్లికార్జున రావుగారిచే వ్రాయబడి దివ్యవాణీ సుకృతి ప్రాసాదమునందు పదమూడవ సుకృతిగా బ్రకాశపరుపబడినది. ఇందవతారావశ్యకత వివిధావతార ప్రయోజనములు, తత్కృత్యములు, తత్తత్వములు చక్కగా దెలుపబడినవి. భగవదవతారములంగూర్చి యాక్షేపించువారిది చదువదగినది. తదవతార విశ్వాసము గలవారికిగూడ నిది పాఠ్యమని యెంచెదము.

28-8-46
శికిందాబాదు

చివుకుల అప్పయ్యశాస్త్రి
సంపాదకుడు

# అవతార విమాంస

## భగవత్కళా విచారము

సర్వవ్యాపకుడును, నిరాకారుడునగు పరమాత్మను స్థూల లౌకిక రూపమున ప్రదర్శించుట యనునది యొక అపూర్వ విషయమై యున్నది. కావుననే అవతార విషయమున అనేక సందేహము లుత్పన్నము లగుచున్నవి. ఇచ్ఛారహితుడగు భగవానుని అంతఃకరణమునందు సంసారివలె ప్రపంచమునందు లీలారూపము ధరింపవలయుననెడి ఇచ్ఛ ఎట్లు జనించినది? మాయారహితుడగు నిరాకార పరమాత్మ మాయామయమగు స్థూలదేహము నెట్లు ధరించెను? దేశకాల వస్తువులవలన సీమారహితుడై సర్వవ్యాపకుడగు పరమాత్మ ఒక చోటినుండి మరియొక చోటికి వచ్చెననునది, అసమంజసము కదా! కారణమేమన-వారు అంతకు క్రితము లేనిచోటికే కదా రావలయును? ఉన్నచోటినుండి ఇక్కడికి వచ్చినపుడు, అక్కడ లేడనియేకదా భావము? ఇట్లు ఒక చోటినుండి మరియొక చోటికి ఈ స్థూల శరీరముతో పరమాత్మ పరుగెత్తవలసిన కారణము మాత్రమేమున్నది? ఆతడు సర్వశక్తి సమన్వితుడైన యెడల తన ఇచ్ఛా మాత్రముననే దుష్టులను సంహరింపజాలడా?

అలౌకిక భావమయమగు అవతార తత్త్వమును గూర్చి ఇట్టి శంకలెన్నియో కలుగుచున్నవి. కావున, ఈ పుస్తకమునందు పైప్రశ్నల కన్నింటికి సంక్షిప్తముగ జవాబుచెప్పి అవ

తారతమ్య నిరూపణ మొనర్పబడును. అవతార విషయమున శాస్త్రములయందనేక ప్రమాణము లున్నవి. ఋగ్వేదము మం. ౬, అ, సూ. 47, శ్లో:—

రూపంరూపం ప్రతిరూపోబభూవతదస్యరూపం ప్రతిచక్షణాయ
ఇంద్రోమాయాభిః పురురూపఈయతేయుక్తా హ్యస్యహరయఃశతాదశ॥

భక్తులయొక్క ప్రార్థన ననుసరించి భగవంతుడు మాయా సంయోగముతో జీవ, అవతారాది అనేకరూపముల ధరించును. అట్టి రూపము లనేకములున్నవి. కాని 10 మాత్రమే ముఖ్యమైనవి.

భగవద్గీతయందిట్లున్నది:—

అజోపిసన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపిసన్
ప్రకృతింస్వామవష్టభ్య సంభవామ్యాత్మమాయయా॥
యదాయదాహిధర్మస్య గ్లానిర్భవతిభారత
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానంసృజామ్యహమ్॥
పరిత్రాణాయసాధూనాం వినాశాయచదుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామియుగేయుగే॥

అజన్ముడును, అవ్యయుడును, సర్వభూతేశ్వరుడు ఐనను మాయయొక్క ఆశ్రయమువలన పరమాత్మ ప్రపంచమునందవతరించుచున్నాడు! ధర్మగ్లానియును, అధర్మవృద్ధియును కలిగినవెంటనే భగవానుడు అవతారమును ధరింపుచున్నాడు. సాధువులను రక్షించుటకొరకును దుష్టులను నాశనమొనర్చుటకును ధర్మమును, సువ్యవస్థిత మొనర్చుటకును, పరమాత్మ ప్రతియుగమునందును అవతరించును. ఈ విధముగా ఆర్యశాస్త్రములయందు అవతారమును గురించిన అనేక ప్రమాణములు లభింపుచున్నవి.

పరమాత్మ సర్వశక్తిమంతుడును, సర్వవ్యాపకుడు నగుటచే, ఆతడు ఒకచోటినుండి మరియొక చోటికి వచ్చెననుట మాత్రము విజ్ఞాన విరుద్ధమే యగును. కాని, అవతార విషయమునందు మాత్ర మేమియును అసంభవత కానుపించుట లేదు. అవతారమనగా ఒక చోటినుండి మరియొక చోటికి వచ్చుట యని అర్థమెంత మాత్రమును కాదు. కాని, సర్వవ్యాపకుడగు పరమాత్మయొక్క శక్తి, ఒకానొక విశేష కేంద్రమునుండి ప్రకటమగుటకే అవతారమని పేరు. అవతార శబ్దమందలి అవతరణము (క్రిందికిదిగుట) భావమూలకము మాత్రమే! పరమాత్మయొక్క విశేషశక్తి, మాయద్వారా సంబంధింపబడి ప్రకటింప బడుటకే భావరాజ్యమునందు అవతరణ మనబడును.

పరమాత్మ సర్వవ్యాపకుడగుటచే ఆతని శక్తికూడ సర్వవ్యాపినియై యున్నది. ఆతనిపై ఆధారపడియున్న జడచేతనాత్మకమగు దృశ్యప్రపంచముద్వారా ఆశక్తి వికాసమును పొందుచుండును. కావుననే జడచేతనాత్మకముల యందెల్లెడల కాన్పించు శక్తియంతయును ఆతనిశక్తియే! ఆతనియొక్క ఈ శక్తియే అగ్నియందును, జలమునందును, ఓషధుల యందును, వనస్పతుల యందును, ప్రపంచము నందంతటను వ్యాపించి యున్నది.

పంచదశీకారుడిట్లనుచున్నాడు:—

సర్వశక్తిమయంబ్రహ్మ నిత్యమాపూర్ణమవ్యయమ్
యథోల్లసతిశక్త్యా సాప్రకాశమధిగచ్ఛతి॥

అద్వితీయ బ్రహ్మమునందు శక్తి నిండియున్నది. ఈశక్తి ఎప్పుడు దృశ్యమును ఆశ్రయించి ఉల్లసించుచున్నదో, అప్పుడు ఇది దృశ్య జగత్తునందు ప్రకాశించు చున్నది. వికాసమును పొందిన ఈ శక్తియే, శాస్త్రములయందు "కళ"యని పిలువ బడును. "షోడశ" శబ్దము పూర్ణత్వ ప్రతిపాదక మగుటచే పూర్ణశక్తి వికసించినచోట షోడశ కళాశక్తులును ప్రకటమైనట్లు భావింపబడును. పూర్ణ చంద్రుడు షోడశ కళాప్రపూర్ణుడని చెప్పబడినట్లే పూర్ణశక్తి కూడ షోడశ కళాపూర్ణశక్తియని చెప్పబడును. పరమాత్మయందు పూర్ణశక్తి యుండుటచే, పరమాత్మ షోడశ కళాపూర్ణుడని చెప్పబడు చున్నాడు,

ఛాందోగ్యము నందిట్లున్నది.

"షోడశ కలః సోమ్యపురుషః"

పరమాత్మ షోడశ కళాశక్తియుక్తుడై యున్నాడు. తైత్తిరీయ బ్రాహ్మణమునం దిట్లున్నది.

"షోడశకలోవై పురుషః"

పరమాత్మకు షోడశ కళలున్నవి. పరమాత్మయొక్క ఈషోడశ కళాత్మక శక్తియే జడచేతనాత్మకమగు సమస్త జగత్తునందును ప్రాప్తమైయున్నది. జీవుడు తన యోని యందు ఉన్నతినందిన కొలదియును, పరమాత్మయొక్క ఈ కళ జీవుని ఆశ్రయమువలన వికాసమును పొందుచున్నది. కళా వికాసమందలి హెచ్చుతగ్గులే జీవయోనియందలి ఉన్నతి, అవనతి సూచకములనికూడ చెప్పవచ్చును. ఒకయోనిలోని

చెదరు. మనుష్యుని యందైనను, అంతకన్న తక్కువ యోని యందలి జీవునియందైనను, ఈ అలౌకిక శక్తియున్నయెడల వారి శరీరము సామాన్య శరీరముగ కానుపించినను, వారిని అవ తారములుగ ఎరుంగవలయును. సాధారణ జీవుల యందీ అలౌ కిక శక్తిని ధరింపగల సామర్థ్య ముండదు. ఇదియే శాస్త్రముల యందలి అవతార సిద్ధాంతము! 9 కళలలోనుండి 15 కళలవర కును అంశావ తారమనియును, 16 కళలతో నిండిన కేంద్ర మునకు పూర్ణావతారమనియు పేర్లు.

ఓషధి, వనస్పతి, వృక్ష, లతాదులయందు ప్రాణాధార ణమొనర్చు శక్తియును, పుష్టి నొసంగు శక్తియు నుండుటచే వీనియందు భగవచ్ఛక్తిలోని ఒక కళమాత్రమున్నదని తెలియ వలయును. స్వేదజ, అండజ జరాయుజ, పశు, మనుష్య, దేవతా దులకు సహితము అన్నమయ కోశముద్వారా ఉద్భిజగణమే తృప్తి నొసంగుచున్నది. ప్రపంచము నందలి దివ్య సౌందర్య మును, బ్రహ్మాండ ప్రకృతియందలి అపూర్వమగు స్థితిదశలును శోభయును, భగవానుని చిత్రవిచిత్రరూప విలాసములును, ఉద్భిజములలోని ఏక కళావికాస ఫలమని ఎరుంగవలయును. ఉద్భిజములయందు కేవలము ఒకకళ ప్రకటితమగుటచేత నే, వానియందు జీవభావమును, సకలేంద్రియ క్రియలును కాన్పించు చున్నవి. ఈ విషయములను నేటి సైంటిస్టులు సహితము యంత్రములద్వారా రుజువుల చేయుచునే యున్నారు.

ఇక స్వేదజమునందు రెండు కళలు వికసించినవి, దీని యందు అన్నమయ ప్రాణమయ కోశములు రెండును కాన్పించు

చున్నవి. ఉద్భిజమునందు, ప్రాణమయకోశము లేకపోవుటచేత ఉద్భిజములు అటునిటు తిరుగజాలకున్నవి. కాని, స్వేదజములు బాగుగా తిరుగగలవు. చెదపురుగువంటి పురుగులలో అత్యద్భుతమగు గృహనిర్మాణ శక్తియును, కలరా, ప్లేగు క్రిములలో క్షణమాత్రమున మనుష్యుల ప్రాణములను హరింపగలశక్తియును రక్తాణువులయందుగల రోగనిరోధక శక్తియును, వీర్యకీటకములయందుగల ప్రజోత్పాదక శక్తియును, స్వేదజములోని భగవచ్ఛక్తియొక్క రెండు కళలవికాస ఫలమని ఎరుంగవలయును.

ఇక, అండజమునందు 3 కళలు వికసించినవి. అన్నమయ ప్రాణమయ కోశములతో పాటు, మనోమయ కోశము కూడ అండజములయందు వికాసము నందినది. కావుననే, వానియందు మిక్కుటమగు మానసిక ప్రేమ కాన్పించుచున్నది ఆడ పావురము మగ పావురములు, శుకశారికలు, చక్రవాకీ చక్రవాకములును, ఒండొంటిని ప్రేమించుకొనుటను చూచుచున్నాము. పక్షులయందు మనోమయ కోశము వికసించుట చేతనే వానియందు వాత్సల్యభావము సహితము అపూర్వముగ వికసించినది. పక్షులు తమ సంతానమును గాఢముగ ప్రేమించును. "వైనతేయశ్చ పక్షిణామ్" అని అండజములయందు సహితము తన విభూతియున్నదని భగవానుడు చెప్పుచున్నాడు.

ఇక, జరాయుజాంతర్గతమగు పశుయోనియందు 4 కళలు వికసించినవి. వీనిలో అన్నమయ, ప్రాణమయ,

మనోమయ కోశములతో పాటు, విజ్ఞానమయ కోశముకూడ పశువులయందు కాన్పించుచున్నది ఉత్కృష్ట పశువులనేకములు మనుష్యులవలెనే అనేక పనులొనర్చుచున్నవి. మనోమయ కోశము మరింత వికసించుటచేత, ప్రేమించుట, ప్రేమను పొందుట, స్నేహము చేయుట మొదలగు పనులను చేయుచున్నవి. ఇతిహాసమును పరిశీలించిన యెడల, ప్రభుభక్తిగల గుర్రములు, కుక్కలు, ఏనుగులు మొదలగు జంతువులు అనేక పర్యాయములు తమ యజమానిని విపత్తునుండి రక్షించినట్లును, తమయజమానికొరకు ప్రాణములను సహితము త్యజించినట్లును యజమాని మరణించిన పిదపనువాని శవమువద్ద నిరాహార దీక్షనుబూని కడకు ప్రాణములను వదలినట్లును, తెలిసికొనగలము. ఇవి యన్నియు, పశుయోనియందు భగవచ్ఛక్తియొక్క 4 కళలు వికసించుటచేతనే కలిగెనని తెలియవలయును.

ఇక, మనుష్యులయందు నిమ్నోన్నత తారతమ్యమునను సరించి, ఈ ఈశ్వరీయ కళలు 5 నుండి 8 వరకును వికసించును. 5 కళలు గలవాడు సామాన్యమానవుడు. 6 కళలు నుండియును విశేషశక్తిగ పరిగణింపబడును. దీనిని శాస్త్రముల యందు "విభూతి" యందురు.

గీతా శాస్త్రమునందిట్లున్నది:—

యద్ యద్ విభూతిమత్ సత్త్వం శ్రీమదూర్జితమేవవా

తత్తదేవావగచ్ఛత్వంమమతేజోఽంశసంభవాత్ ॥

ప్రపంచమునందున్న ఐశ్వర్యయుక్త, తేజోయుక్త, శక్తియుక్త పదార్థములన్నియు భగవచ్ఛక్తియొక్క వికాసము వలన జనించినట్లు భావింప వలయును. భగవానుని విశేష శక్తి వలన పొందిన విభూతులద్వారా ప్రపంచమునందనేక ధార్మిక కార్యములు నెరవేరుచున్నవి. అవతారముయొక్క అవశ్యకత కలుగనంత వరకును, సామాన్యముగా ఈ విభూతులవలననే ధర్మము రక్షింపబడుచుండును. ప్రవక్తలును, శక్తిసంపన్నులగు దేశ నాయకులును ఈ శ్రేణియందే గణింపబడెదరు. కాని, ఒక విషయమును మాత్రము ముఖ్యముగ గ్రహింపవలసియున్నది. ఈ విభూతులయందు అసంపూర్ణశక్తి మాత్రమే ఉండుటచేత వీరివలన జరుపబడెడి కార్యములు సహాతము ఆయా దేశకాలములకు మాత్రమే అనుకూలించి యుండును.

షోడశకళా పరిపూర్ణుడును, సర్వశక్తివంతుడునగు భగవానుని 8 కళల వరకును లౌకికమగు మనుష్యాదులయందు ప్రకటమగుట కవకాశమున్నది. కాని 8 కళలకుపైన ఆశక్తి నిధరించుటకు లౌకిక కేంద్రములు అసమర్థములై యున్నవి. కావున, 9 నుండి 16 కళలవరకును భగవచ్ఛక్తి ఏయే మనుష్య పశ్వాదులయందు ప్రకటితమగునో వారందరును అవతారములని పిలువబడుదురు. భగవద్గీతయందిట్లున్నది:—

భావయత్యేష సత్త్వేన లోకాన్ వై లోకభావనః
లీలావతారానురతో దేవ తిర్యఙ్నరాదిషు॥

లోకపాలకుడగు భగవంతుడు దేవ, తిర్యక్, మనుష్యాది శరీరములద్వారా లీలావతారమును ధరించి ప్రపంచమును రక్షింపుచుండును.

# అవతారము లెన్ని?

ఇట్టి అవతారము లెన్ని ఉండును? ఈ ప్రశ్నకు జవాబు చెప్పుచు భాగవత ప్రథమస్కంధము తృతీయాధ్యాయము నందిట్లు చెప్పుచున్నాడు

అవతారాహ్యసంఖ్యే యాహరేః సత్త్వనిధేర్ద్విజాః
యథావిదాసినః కుల్యాః సరసః స్యుః సహస్రశః॥
ఋషయో మనవో దేవా మనుపుత్రా మహౌజసః
కలాః సర్వే హరేరేవ సప్రజాపతయస్మృతాః॥
ఏతే చాంశకలాః పుంసః కృష్ణస్తు భగవాన్ స్వయమ్
ఇంద్రారివ్యాకులం లోకం మృడయన్తి యుగేయుగే॥

అగాధ జలయుక్తమగు సరస్సునుండి పెక్కు వేలకాలువలు ప్రవహించునట్లు, సత్త్వగుణాశ్రయుడగు భగవానుని నుండి అనేక అవతారము లుత్పన్నములగుచున్నవి. ఋషిగణము, మనుగణము, దేవగణము, మనుపుత్రగణము, ప్రజాపతిగణము మొదలగువారందరియందును భగవంతుని కళలు విభూతిరూపమున ప్రకాశించుచున్నది. ఇతర అవతారముల యందు భగవానుని ఆంశికశక్తి వికసించియున్నది కాని శ్రీకృష్ణునియందు సంపూర్ణ భగవచ్ఛక్తి వికాసమొంది యుండుటచే శ్రీకృష్ణుడు భగవత్స్వరూపుడని పిలువబడుచున్నాడు. దైత్యులచే ప్రపంచము అల్లకల్లోలమైనపుడట్టి అంశావతారములును, పూర్ణావతారములు నుద్భవించుచుండును. ఇక శాస్త్రముల యందిట్టి అవతారములలో 24 ముఖ్యములనియు, ఆ ఇరువది నాల్గింటిలోను 10 మాత్రమే అత్యంత ముఖ్యములనియు వ్రాయబడియున్నది.

మత్స్యః కూర్మో వరాహశ్చ నృసింహో వామనస్తథా
రామో రామశ్చ రామశ్చ బుద్ధః కల్కిస్తథాస్మృతాః

మత్స్య, కూర్మ, వరాహ, నృసింహ, వామన, పరశురామ, రామ, కృష్ణబలరామ; బుద్ధ, కల్కి ఈ పదియును అవతారములై యున్నవి. శాస్త్రములయందు సామాన్యముగ 10 అవతారములనియు, 24 అవతారములనియు వ్రాయబడుట యేగాక, అసంఖ్యావతారము లున్నవనికూడ చెప్పబడియున్నది. శైవపురాణమునందు అనేక శివావతారములు వర్ణింపబడియున్నవి. గణేశపురాణమునందు గణపతియొక్క అనేక అవతారములును, శాక్తేయ పురాణములయందు శక్తియొక్క అనేక అవతారములును, సూర్యోపాసనా గ్రంథములయందు సూర్యుని అవతారములును, విష్ణుసంబంధమగు గ్రంథములయందు విష్ణుభగవానుని అవతారములునువర్ణింపబడియున్నవి. కావున పంచోపాసనా సిద్ధాంతము ననుసరించి విష్ణు, శివ, గణపతి, సూర్య, దేవీ అవతారము లనేకములున్నవని శాస్త్రములయం దనేక ప్రమాణములున్నవి. జగత్కారణుడగు జగదీశ్వరు డొక్కడేయైనను, వాని అవతార తత్త్వరహస్యము సహిత మొక్కటియేయైనను, పంచగుణోపాసకుల ఉపాసనా మహత్త్వమువలన పంచోపాసనయొక్క స్వతంత్ర స్వతంత్ర భావములను తీసికొని, జగద్రక్షణకొరకు స్వతంత్ర స్వతంత్ర భావపూర్ణమగు స్వతంత్ర స్వతంత్ర కళలతో భగవానుని అవతారములు అప్పుడప్పుడు ప్రకటింపబడినవి. ప్రకటింపబడుచున్నవి. మహావిష్ణు భావముచేనైనను, మహాశక్తి భావముతోనైనను, మహాగణపతి భావముతోనైనను, మహాదేవ భావ

ముతోనైనను, మహాసూర్య భావముతోనైనను, ఏభావముతో అవతరించినను. అవియన్నియును సర్వశక్తిమంతుడును, అద్వితీయుడు నగు నా బ్రహ్మముయొక్క అవతారములుగ గ్రహింపవలయును. ఇక అవతారవిషయమున కొన్ని వేదప్రమాణములను చూపించి, తర్వాత అవతార కారణమును, అవతార లీలా వర్ణనము నొనర్చెదము గాక!

# అవతారవిషయము వేదశాస్త్రములందు గలదా?

శతపథబ్రాహ్మణము కా 1, అ 8, బ్రా 1, కండిక 1.6 లో మాయావతారముచుగురించి బాగుగా వర్ణింపబడియున్నది. అథర్వవేదము 12, అను 1 లో ఇట్లున్నది:-

"వరాహేణ పృథివీ సంవిదానా శూకరాయ విజిహీతేమృగాయ"

వరాహరూపుడగు భగవానుడు ఈపృథ్వి నుద్ధరించెను. ఋగ్వేదసంహిత మ 1, అ 21, సూ 154 నందిట్లు వర్ణింపబడియున్నది:-

ప్రతద్విష్ణుః స్తవతే వీర్యేణమృగో నభీమః కుచరోగిరిస్థాః

నృసింహ రూపధారియును, భయంకరుడు నగు భగవంతుడు స్తుతింపబడుచున్నాడు. సామవేదము 18-2-8-2-5-1-2 లో ఇట్లున్నది:-

త్రీణిపదా విచక్రమేవిష్ణుర్గోపా అదాభ్యః॥ అతోధర్మాణిధారయన్"
"ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధేపదమ్" 18.2-1

ప్రపంచమును రక్షించెడి భగవంతుడు ధర్మరక్షణము కొరకు వామనావతారమునందు 3 పాదములతో 3 లోకములను ఆవరించుచున్నాడు.

ఐతరేయబ్రాహ్మణము 3-5 34 నందిట్లున్నది:-

"ప్రోవాచరామో భార్గవేయో విశ్వన్తరాయ"

భృగుకులతిలకుడగు పరశురాముడు విశ్వన్తరునితో చెప్పెను.

సామవేదసంహిత ఉత్తరార్చికము 15-2-1-3 నందిట్లున్నది:-

భద్రోభద్రాయ సచమాన ఆగాత్ స్వసారంజారో అభ్యేతిపశ్చాత్

శ్రీరామచంద్ర భగవానుడు సీతాదేవితో అరణ్యమునకు పోయెను. దుర్మార్గుడగు రావణుడు రామచంద్రుని పరోక్షమున సీతను అపహరింపవలయునని వచ్చెను.

ఛాందోగ్యము ప్ర 3, ఖండము 17 నందిట్లున్నది:-

"ఏతద్ఘోర ఆంగిరసః కృష్ణాయ దేవకీపుత్రాయోక్త్వావాచేతి"

ఆంగిరసుడు ఈమాటలను దేవకీపుత్రుడగు కృష్ణునితో చెప్పి వాతో చెప్పెను.

"సమిష్టి కర్మాధీనంతత్"

అవతారము ఏదో ఒక జీవియొక్క కళ్యాణముకొరకు జరుగదు. సమిష్టిజీవుల కళ్యాణముకొరకే జరుగును. అవతారములు 5 విధములై యున్నవి:-

"కళాభేదేనా పూర్ణాంశత్వమ్"

"నిమిత్తాద్ విశేషావిశేషా"

"అంతరావిర్భావస్య నిత్యత్వమ్"

కళాభేదమువలన పూర్ణావతారములనియు, అంశావతారములనియు రెండువిధములు. తొమ్మిది కళలనుండి 15 కళల వరకును అంశావతారమనబడును. 16 కళలుగల అవతారము పూర్ణావతారమనబడును. నిమిత్త భేదమువలన విశేష అవతారములనియు, అవిశేష అవతారములనియు రెండు విధములుగా నుండును. అంతఃకరణమునందు ప్రకటమగు శ్రీభగవానునకు నిత్యావతారమని పేరు. ఈ ప్రకారముగా, పూర్ణావతారము అంశావతారము విశేషావతారము, అవిశేషావతారము, నిత్యావతారమని, అవతారము లైదు విధములైయున్నవి.

ప్రతి యుగమునందును ధర్మముయొక్క వికాసము ఆ యుగమందలి మనుష్యుల సమష్టికర్మ ననుసరించి యుండును, ఈ నియమమునందు బాధకలుగనంతవరకును అవతారము యొక్క అవశ్యకత లేదు. ఒకానొకప్పుడట్టి అసామంజస్య మొదవినను, 8 కళలకు లోపలనేగల భగవద్విభూతిద్వారా ధర్మము సువ్యవస్థిత మొనర్పబడుచుండును. కాని ఎప్పుడైనను రాక్షసాదులవలన ధర్మవికాసమున కాటంకముగలిగి సమిష్టి ధర్మమునందు బాధగలిగిన యెడల, 8 కళలకులోగల వారివలన ధర్మము సువ్యవస్థిత మొనర్చుటకు వీలుగాని యెడల ఏదోయొక విశేష కేంద్రముద్వారా 8 కళలకుపైగా గల భగవచ్ఛక్తి ప్రవహించి, ధర్మమును నిరాటంక మొనర్పవలయును. రామావతారమునుగూర్చి రామాయణము.

బాలకాండమునందిట్లు చెప్పబడినది:—

సహితే పేతపస్తీవ్రం దీర్ఘకాలమరిందమః
యేనతుష్టోఽభవద్బ్రహ్మా లోకకృల్లోకపూర్వజః

సంతుష్టః ప్రదదౌ తస్మై రాక్షసాయ వరం ప్రభుః
నానావిధేభ్యో భూతేభ్యో భయం నాన్యత్ర మానుషాత్
అవజ్ఞాతాః పురా తేన వరదానే హి మానవాః॥ ఏవం పితామహాత్తస్మాత్
వరదానేన గర్వితః॥ ఉత్సాదయతి లోకాంస్త్రీన్ స్త్రియశ్చాప్యపకర్షతి
తస్మాత్తస్య వధో దృష్టో మానుషేభ్యః పరంతప
ఉద్వేజయతి లోకాం స్త్రీనుచ్ఛ్రితాన్ ద్వేష్టి దుర్మతిః॥
శక్రం త్రిదశరాజానం ప్రధర్షయితుమిచ్ఛతి॥
ఋషీన్ యక్షాన్ సగంధర్వాన్ బ్రాహ్మణానసురాంస్తథా
అతిక్రామతి దుర్ధర్షో వరదానేన మోహితః॥
నైనం సూర్యః ప్రతపతి పార్శ్వే వాతి న మారుతః
చలోర్మిమాలీ తం దృష్ట్వా సముద్రోపి న కంపతే॥
తన్మహాన్నో భయం తస్మా ద్రాక్షసాద్ఘోరదర్శనాత్
వధార్థం తస్య భగవన్నుపాయం కర్తుమర్హసి॥

రాక్షస రాజగు రావణుడు చాల కాలము కఠినమగు తపమాచరించెను. దానివలన బ్రహ్మదేవుడు సంతుష్టిజెంది "నీకు మనుష్యులవలన తప్ప ఇతర ప్రాణులవలన ఏవిధమైన అపాయమును లేకుండును గాక" యని వరమొసంగెను. ఈ వర ప్రభావమువలన గర్వించి రావణాసురుడు స్త్రీలను బలాత్కరించి, ప్రజలను బాధింపసాగెను. కావున, వానిని వధింపవలసినయెడల మనుష్యుడే వధింపవలసి యుండెను. రావణుడు సమస్త లోకములను, స్త్రీలను, ఋషియక్ష గంధర్వ బ్రాహ్మణాదుల నందరను బాధించుచుండెను. వానినిచూచి సూర్యుడు భయపడి సరిగా ప్రకాశింపజాలకుండెను. వాయువు సరిగా వీవజాలకుండెను. సముద్రము భయముతో కంపించుచుండెను. అందరును భగవంతుని ప్రార్థించిరి. ఇక భగవంతుడే, వీనిని సంహరించుటకు అవతరింపవలసి వచ్చెను.

# మత్స్యావతారము

ఇక, 10 అవతారములనుగురించి సంక్షిప్తముగ వివరించెదను. ఈ పది అవతారములలోను మొట్టమొదటిది మత్స్యావతారము నైమిత్తిక ప్రళయ సమయమున, సృష్టి యంతయును జలమగ్నమైనయపుడు, సృష్టిబీజమును రక్షించుట కీయవతారము ఆవిర్భవించును. జలమునుండి సృష్టిని రక్షింప వలయును. కావున జలచరమగు చేపరూపమున భగవదవతారము జరుగవలసియున్నది ఈవిషయమును గురించి యగ్ని పురాణమునందిట్లు వర్ణింపబడియున్నది:- పూర్వకల్పాంతరమునందు నైమిత్తిక ప్రళయము జరిగిన పిదప పృథ్వ్యాది లోకములన్నియు జలమగ్నము లయ్యెను. ఆ సమయమునకు క్రితమే వైవస్వతమనువు ఘోరమగు తపమొనర్చుచుండెను. ఒకరోజు అతడు కృతమాలా నదియందు తర్పణమొనర్చుచున్నపుడు, ఒక చిన్నచేప అతని దోసిలిలోనికి వచ్చెను. మనువు దానిని మరల నీటియందు వదిలి వేయబోయెను. కాని ఆ మత్స్యమిట్లనెను, "రాజా! నన్ను నదియందు పారవేయకుము నేను నదియందలి "మొసలి" మొదలగు జంతువులనుచూచి చాల భయపడుచున్నాను." అనెను ఆమాటలనువిని మనువు దానిని తన చెంబులో పడవైచెను. కొంచెముసేపునకామత్స్యము మరింత పెద్దదిగానై నాకుమరియొక స్థానమును చూపింపుమని అడిగెను. మనువు దానిని ఒక సరస్సునందు పడవైచెను. కాని. అది క్రమక్రమముగా పెరుగుచు సరస్సునంతయు కప్పివైచెను. మనువు దానిని చూచి, "దేవా! నీవు భగవానుడవుకాని,

సామాన్యమత్స్యమవుకావు. నన్ను భ్రాంతియందు పడవేయకుము" అని ప్రార్థించెను. అప్పుడామత్స్య రూపమందున్న భగవానుడు "నేను దుష్టులను నాశనమొనర్చి ధర్మమును రక్షించుటకై అవతరించినాను. నేటికి ఏడవదినమున ప్రళయము సంభవించి ప్రపంచమంతయును జలమగ్నమగును అపుడు నేనొక నావను పంపెదను. దానియందు నీవును, సప్తఋషులును నివసింపవలయును." అని సెలవిచ్చెను, అటులనే 7-వ దినము ప్రళయము జరిగెను. నావవచ్చెను. నావయందు సప్త ఋషులును, మనువును కూర్చుండి సృష్టిబీజములను కాపాడిరి.

## కూర్మావతారము

కూర్మావతారము దైవరాజ్యావతారమై యున్నది. ఒకానొకప్పుడు దైవీశక్తి ఆసురీశక్తివలన ఓడింపబడెను. దీనివలన ప్రపంచమునందు అధర్మము పెరిగిపోయెను. అపుడు భగవంతుడు దేవతలతో "మీరు రాక్షసులతో సంధిచేసుకొని, యిరువురును కలిసి సముద్రమును మథించుడు, దానినుండి వెలువడెడి అమృతమును త్రాగినయెడల మీరు జయించి ధర్మమును పునఃస్థాపన మొనర్పగలరని" చెప్పెను. అటులనే, సముద్రమును మథించునపుడు మందర పర్వతముక్రిందికి క్రుంగిపోవుచుండగా భగవానుడు కూర్మరూపమును ధరించి ఆ పర్వతమును తన వీపుపై నిడుకొని కాపాడెను. అపుడు లక్ష్మి, పారిజాతము ధన్వంతరి, అమృతము మొదలగునవి ఉద్భవించెను. ప్రపంచమునందు సహితము రెండు విరుద్ధ శక్తుల సంఘర్షణ

వలననే ఏదైన కార్యము జరుగును. కాని, దాని సామంజస్యమును Balance కాపాడుటకొరకు ధర్మశక్తి వానిని తన వీపుపై ధరించినపుడే ఉత్తమ వస్తువులన్నియు ఉద్భవించును,

## వరాహావతారము

మూడవ అవతారము వరాహావతారమై యున్నది. పాతాళమునకు పోయిన పృథ్విని కాపాడుటకొరకు ఈ అవతారముద్భవించినది. జయవిజయులను ద్వారపాలకులు సనకాది బ్రహ్మ ఋషుల శాపమువలన హిరణ్యాక్ష, హిరణ్యకశిపులను రూపములను ధరించిరి. హిరణ్యాక్షుడు పృథ్విని పాతాళమున తీసికొనిపోయెను. దానిని ఉద్ధరించుట కొరకే వరహావతారముద్భవించెను.

## నృసింహావతారము

నాల్గవతారము నృసింహావతారము బ్రహ్మవలన అనేక వరములను పొంది గర్వించి ప్రపంచమును అల్లకల్లోలమొనర్చుచు, పరులచేతను పశువుల చేతను మరణము లేదనెడి అహంకారముతోనున్న హిరణ్యకశపుని సంహరించుటకే నృసింహావతార మవతరించెను.

హిరణ్యకశిపునకు ప్రహ్లాదుడనెడి కుమారుడుండెను. ఒకరాజు తండ్రి కుమారుని పిలిచి పాఠమును ఒప్పగించుమని కోరగా ప్రహ్లాదుడిట్లు జవాబిచ్చెను,

తత్సాధుమన్యేఽ సురవర్య దేహినాం
సదాసముద్విగ్న ధియామసద్గ్రహాత్

హిత్వాత్మపాతం గృహమంధకూపం
వనంగతో యద్ధరిమాశ్రయేయం॥

"ఓ రాక్షసరాజా! ఆత్మనాశన మొనర్చెడి అంధ కూప తుల్యమగు గృహమును పరిత్యజించి అరణ్యములకు పోయి భగవానుని ధ్యానించుటయే శ్రేష్ఠమైన కార్యమని నేను భావించుచున్నాను."

ఈ మాటలను విని హిరణ్యకశిపుడు కోపించి, విష్ణుభక్తిని వదలవలసినదిగా ప్రహ్లాదుని అనేకవిధముల బాధించెను కడకు కత్తిని తీసికొని "దేవుడున్న యెడల ఈ స్తంభమునందు చూపు"మని స్తంభముపై దెబ్బకొట్టెను. అపుడు భయంకరమగు శబ్దము కలిగెను. అప్పుడు:—

సత్యంవిధాతుంనిజ భృత్యభాషితమ్
వ్యాప్తించభూతే ష్వఖిలేచాత్మనః
అదృశ్యతాత్యద్భుత రూపముద్వహన్
స్తంభేసభాయాం నమృగంనమానుషం॥

తన భృత్యుడగు ప్రహ్లాదుని వాక్యమును సత్యమొనర్చుట కొరకు భగవానుడు నరసింహావతార మెత్తి ఉద్భవించి హిరణ్యకశిపుని తన గోరులతో చీల్చి చంపివైచెను.

## వామనావతారము

అయిదవ అవతారము వామనావతారము. బలిచక్రవర్తి తన పరాక్రమమువలన దేవతల నందరను స్వర్గచ్యుతుల నొనర్చి సృష్టిక్రమమునందు ఆటంకము కల్గించెను. అందువలన భగవానుడు వామనావతార మెత్తి 3 అడుగుల మేరను దానము తీసికొని, బలిచక్రవర్తిని పాతాళలోకమునకు పంపివైచెను.

# పరశురామావతారము

అరవ అవతారము పరశురామావతారము. ఈ అవతారమునందు బ్రాహ్మణద్వేషులగు క్షత్రియులనందరను భగవానుడు నాశన మొనర్చెను.

మనుసంహితయందిట్లున్నది.

నాబ్రహ్మక్షత్రమృధ్నోతి నాక్షత్రంబ్రహ్మవర్ధతే
బ్రహ్మక్షత్రశ్చసంపృక్త మిహచాముత్రవర్ధతే॥

బ్రహ్మశక్తి లేనిదే క్షాత్రశక్తి పుష్టి నొందజాలదు. క్షాత్రశక్తి లేనిదే బ్రాహ్మణశక్తి వృద్ధినొందజాలదు. రెండింటి యొక్క పరస్పర సహాయ సహానుభూతులవలననే ప్రపంచ కళ్యాణము జరుగగలదు. కాని, త్రేతాయుగమునందొకానొకప్పుడు బ్రాహ్మణ క్షత్రియుల యందలి పరస్పర సహానుభూతి నశించెను. క్షత్రియులు అధికార మదోన్మత్తులై, నిరపరాధులగు బ్రాహ్మణులను హింసింపసాగిరి. ఈ కారణమున ధర్మమునందు గ్లానిసంభవించెను. దత్తాత్రేయుని వరప్రభావమువలన గర్వించి కార్తవీర్యార్జునాదులు తమతపోబలమును ధర్మనాశనమునందు వినియోగింప సాగిరి. అప్పుడు భగవానుడు అవతారమును ధరించి అధార్మికమగు క్షాత్రశక్తిని నాశనమొనర్చి ప్రపంచమునందు శాంతిని, ధర్మమును స్థాపించెను. కావుననే పరశురాముడు 21 మారు భూలోకమందలి దుష్టక్షత్రియులనెల్లరను వధించెను. కాని. శ్రీరామచంద్రావతార ముద్భవించిన వెంటనే, పరశురాముని శక్తియంతయును శ్రీరామునియందు ప్రవేశించెను.

రామాయణమున నిట్లున్నది.

తతఃపరశురామస్య దేహాన్నిర్గత్యవైష్ణవమ్
పశ్యతాంసర్వదేవానాం తేజోరామముపాగమత్॥

పరశురామునిలోని శక్తి రామచంద్రునియందు ప్రవేశించెను. దేవతలందరును ఈ అలౌకిక దృశ్యమును చూడసాగిరి.

## శ్రీరామావతారము

ఇక, ఏడవ అవతారము రామావతారమైయున్నది ఈ రామావతారమువలన ఆదర్శజీవితమునకొక దృష్టాంతము చూపింపబడినది. ఇదియే ప్రపంచమునందలి మానవులకెల్లరకును అనంత కాలమువరకును కళ్యాణ మార్గమైయున్నది.

రామాయణము బాలకాండయందిట్లు చెప్పబడియున్నది

కౌసల్యాజనయద్రామం దివ్యలక్షణసంయుతం
విష్ణోరర్ధంమహాభాగం పుత్రమైక్ష్వాకునందనం॥
భరతోనామకైకేయ్యాం జజ్ఞేసత్యపరాక్రమః
సాక్షాద్విష్ణోశ్చతుర్భాగః సర్వైఃసముదితోగుణైః॥
అథలక్ష్మణశత్రుఘ్నౌ సుమిత్రాజనయత్సుతౌ
వీరౌసర్వాస్త్రకుశలౌ విష్ణోరర్ధసమన్వితౌ॥

దశరథునకు ముగ్గురు భార్యలుండిరి. అందు కౌసల్యాదేవి దివ్యలక్షణ సంయుతుడును, విష్ణుభగవానుని అర్ధాంశమునగు శ్రీరామచంద్రుని ప్రసవించెను. కైకేయియు సర్వగుణసంపన్నుడును, విష్ణుభగవానుని చతుర్థాంశమునగు భరతుని ప్రసవించెను. సుమిత్రాదేవి వీరులును అస్త్రవిద్యానిపుణులును విష్ణుభగవానుని అష్టమాంశములునగు లక్ష్మణ శత్రుఘ్ను

లను ప్రసవించెను. ఈ విధముగా నలుగురును కలిసి విష్ణుభగవానుని పూర్ణరూపమాయెను. మాయ పరమాత్మయొక్క నిత్యసంగినియైయున్నది. కావున మహామాయ సీతాదేవి రూపమును ధరించి స్త్రీజాతికొక సంపూర్ణమగు ఆదర్శమును చూపించి యున్నది.

రామోత్తర తాపన్యుపనిషత్తునందిట్లున్నది

శ్రీరామసాన్నిధ్యవశా జ్జగదాధారకారిణీ
ఉత్పత్తిస్థితిసంహారకారిణీ సర్వదేహినామ్
సాసీతాభవతిజ్ఞేయా మూలప్రకృతిసంజ్ఞితా॥

పరమాత్మస్వరూపుడగు శ్రీరామునిసాన్నిధ్యమునందు జగత్తునకంతకును ఆధారరూపిణియును, సృష్టిస్థితిప్రళయకారిణియును, మూలప్రకృతి స్వరూపిణియునగు సీతాదేవియుండెను. ఆదర్శమానవ జీవితము రామావతారమునందు చక్కగా ప్రదర్శింపబడెను. ఆదర్శ సతీజీవనము సీతాదేవి ద్వారా చక్కగా చూపింపబడినది కావుననే అంశావతారము లన్నింటిలోను రామావతారమే ముఖ్యమైనది. కావుననే, ప్రపంచమునందు రామావతారము ఇంతగా పూజింపబడుచున్నది. రామావతారమందలి దేశకాల పరిస్థితులను పరిశీలించినయెడల రామావతారముయొక్క ఆవశ్యకత గోచరింపగలదు. పూర్వావతారమగు పరశురామావతారము వలన ప్రపంచమునందలి క్షత్రియు లందరును నశించిరి. క్రమక్రమముగా బ్రాహ్మణశక్తి అన్యమార్గములను పట్టుటచే, రావణునివంటి అత్యాచారులు సహితము బ్రాహ్మణ వంశమునందు జన్మింపసాగిరి. ఆ సమ

యమున, ఏదైన ఒక భగవచ్ఛక్తి ఆవిర్భవించి కృంగిపోవు చున్న క్షాత్రశక్తిని ఉద్ధరించి, బ్రాహ్మణ క్షాత్రశక్తులకు సామంజస్య మొదవించి, ప్రపంచమునకొక ఆదర్శమానవ జీవితమును చూపించ వలసిన అవసరము కలిగినది. కావుననే శ్రీరామచంద్రమూర్తి క్షత్రియ కులమునందుద్భవింపవలసి వచ్చి నది. రావణాసురుని వలన పతివ్రతలగు స్త్రీలనేకులు చెడ గొట్టబడిరి- పతివ్రతల హృదయవిదారకరోదనము భూనభోంతరాళముల భేదించుచుండెను. అప్పుడు మహామాయయే సీతారూపమున అవతరించి, రావణుని నాశనమునకు సహాయ పడి స్త్రీజాతికొక ఆదర్శ జీవనమును చూపించెను.

అన్నదమ్ములగు రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు ప్రపంచమునకొక గొప్పఆదర్శము చూపెట్టిరి. రామచంద్రుని యందు సంపూర్ణ మానవత్వమును, సీతాదేవియందు ఆదర్శ నారీత్వమును ప్రకటింపబడినవి.

రామాయణము బాలకాండమునందిట్లున్నది:—

ఇక్ష్వాకువంశప్రభవో రామోనామజనైశ్శ్రుతః
నియతాత్మామహావీరో ద్యుతిమాన్ధృతిమాన్వశీ॥
బుద్ధిమాన్నీతిమాన్ వగ్మీశ్రీమాన్శత్రునిబర్హణః
విపులాంసోమహాబాహుః కంబుగ్రీవోమహాహనుః॥
మహోరస్కోమహేష్వాసో గూఢజత్రురరిందమః
ఆజానుబాహుఃసుశిరాః సులలాటఃసువిక్రమః
సమఃసమవిభక్తాంగః స్నిగ్ధవర్ణఃప్రతాపవాన్
పీనవక్షోవిశాలాక్షో లక్ష్మీవాంచ్ఛుభలక్షణః॥
ధర్మజ్ఞఃసత్యసంధశ్చ ప్రజానాంచహితేరతః
యశస్వీజ్ఞానసంపన్నః శుచిర్వశ్యఃసమాధిమాన్

ప్రజాపతిసమఃశ్రీమాన్ ధాతారిపునిషూదనః
రక్షితాజీవలోకస్య ధర్మస్యపరిరక్షితా॥
రక్షితాస్వస్య స్వస్య స్వజనస్యచరక్షితా
వేదవేదాంగతత్త్వజ్ఞో ధనుర్వేదేచనిష్ఠితః
సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞః స్మృతిమాన్ప్రతిభానవాన్
సర్వలోకప్రియఃసాధు రదీనాత్మావిచక్షణః॥
సర్వదాభిగతఃసద్భిః సముద్రఇవసింధుభిః
ఆర్యఃసర్వసమశ్చైవ సదైవప్రియదర్శనః॥
సచసర్వగుణోపేతః కౌసల్యానందవర్ధనః
సముద్రఇవగాంభీర్యే ధైర్యేణహిమవానివ॥
విష్ణునాసదృశోవీర్యే సోమవత్ ప్రియదర్శనః
కాలాగ్నిసదృశఃక్రోధే క్షమయాపృథివీసమః
ధనదేవసమస్త్యాగే సత్యేధర్మఇవాపరః॥

ఇక్ష్వాకు వంశమునందు జగత్ప్రసిద్ధుడగు శ్రీరామ చంద్రుడుత్పన్నమాయెను. వానియందు సంపూర్ణ మానవున కుండవలసిన సమస్త సద్గుణములును నిండియుండెను. అతడు మహావీర్యవంతుడును, కాంతిమంతుడును, ధృతిమంతుడును, జితేంద్రియుడును, బుద్ధిమంతుడును, రాజనీతియందు పరిపూర్ణ జ్ఞాతయును, వక్తయును, శ్రీమంతుడును, బహిరంతర శత్రు నాశకుడును, విపులమస్తకుడును, మహాబాహుడును, శంఖమువలె రేఖాత్రయ విశిష్టగ్రీవము గలవాడును, విశాలవక్షము గలవాడును, మహాధనుర్ధరుడును, సుశీలుడును, విశాలనేత్రములును. గలవాడును, స్నిగ్ధశ్యామల వర్ణము గలవాడును, ప్రజాహిత పరాయణుడును, కీర్తి సంపన్నుడును, శౌచసంపన్నుడును, బాహ్యాభ్యంతర శుద్ధిగలవాడును, వినయశీలుడును, యోగ యుక్తుడును, ప్రజాపోషణ సామర్థ్యయుక్తుడును, జీవరక్షకుడును

ధర్మరక్షకుడును, స్వజనరక్షకుడును, వేదవేదాంగ మర్మజ్ఞుడును ధనుర్వేద పరిజ్ఞాతయును, సర్వలోక ప్రియమగు మృదుమధుర స్వభావముగలవాడును, దైన్యస్వభావము లేనివాడును, లౌకికాలౌకిక సర్వక్రియాకుశలుడును, సర్వసత్పురుష సంసేవితుడును సుఖదుఃఖాది ద్వంద్వవికారరహితుడును, సర్వసద్గుణ సంయుతుడును, రాజునకుండవలసిన యోగ్యతలు గలవాడును, క్రోధమునందు కాలాగ్ని రుద్రుడును, క్షమయందు పృథ్వీతుల్యుడును ధనదానమునందు కుబేరుడును, సత్యపాలనమునందు సాక్షాత్ ధర్మరాజునై యుండెను. ఇన్ని సద్గుణము లాతనియందు కేంద్రీకరించుటచేతనే ఆతడు సమస్తమానవులకును, సమస్త క్షత్రియులకును, సమస్త గృహస్థులకును, ఆదర్శప్రాయుడై యున్నాడు. ప్రజలందరును బాగుగా సుఖించునపుడే రాజు నిజముగా సార్థకుడగును.

## రామరాజ్య వర్ణనము

రామరాజ్యమునందు ప్రజలెట్లు సుఖించిరో రామాయణము యుద్ధకాండాంతమునందిట్లు చెప్పుచున్నాడు:-

నపర్యదేవన్ విధవానచ వ్యాలకృతం భయమ్
నవ్యాధిజం భయం చాసీద్రామేరాజ్యం ప్రశాసతి॥
నిర్దస్యురభవల్లోకో నానర్థం కశ్చిదస్పృశత్
నచస్మవృద్ధా బాలానాం ప్రేతకార్యాణికుర్వతే॥
సర్వంముదితమేవాసీత్ సర్వోధర్మపరోభవత్
రామమేవాను పశ్యంతో నాభ్యహింసన్ పరస్పరమ్॥

ఆసన్ వర్షసహస్రాణి తథా పుత్రసహస్రిణః
నిరామయా విశోకాశ్చరామేరాజ్యం ప్రశాసతి॥
నిత్యమూలా నిత్యఫలాస్తరవస్తత్ర పుష్పితాః
కామవర్షీ చపర్జన్యః సుఖస్పర్శశ్చమారుతః॥
స్వకర్మ సుప్రవర్తన్తే తుష్టాః స్వైరేవకర్మభిః
ఆసన్ ప్రజాధర్మపరా రామేశాసతినానృతాః॥
సర్వే లక్షణసంపన్నాః సర్వేధర్మపరాయణాః

శ్రీరామచంద్రుని కాలమునందు స్త్రీలు వైధవ్యము నంద లేదు. ప్రజలకు సర్పభయ,రోగభయాదులు లేవు, దొంగల ఉపద్రవమేమియును లేదు. వృద్ధులగు తల్లిదండ్రులు తాము జీవించియుండగనే తమ పుత్రులకు శ్రాద్ధకర్మ నాచరింప వలసిన అవసరము లేదు. ప్రజలందరును ఆనందపూర్ణులును, ధర్మ పరాయణులునై యుండిరి. శ్రీరామచంద్రుని ఆదర్శ ధార్మిక భావమును ఆదర్శముగ నుంచుకొని, ప్రజలు అన్యోన్య హింసాని మగ్నులు కాకుండిరి. వేలకొలది పుత్రులతో వేల కొలది సంవత్సరముల వరకును మనుష్యులు జీవింపగలిగి యుండిరి. వృక్షములెల్లప్పుడును ఫలపుష్పమూలములతో శోభిల్లు చుండెను. ఇచ్ఛానుకూలముగనే మేఘము వర్షించుచుండెను. శీతలమందసుగంధ వాయువు వీచుచుండెను. ప్రజలందరును స్వధర్మముతో తృప్తిని వహించి స్వధర్మనిరతులై యుండిరి. మిథ్యా వ్యవహార ప్రచారము లేకుండెను

ఆదర్శ నరపతియగు శ్రీరామచంద్రుని రాజ్యమునం దిట్లు ప్రజలు సుఖించుచుండిరి. ప్రజాపాలనమును, ప్రజారంజ

నము నొనర్చుటకు అష్టలోకపాలకుల అంశములను సేకరించి రాజు జన్మించుచున్నాడు. ప్రజారంజన మొనర్చెడి రాజు నిజముగా దేవతయే! ప్రజాపీడన మొనర్చెడి రాజు అసురాంశవలన జన్మించెనని శాస్త్రములు చెప్పుచున్నవి! ప్రజలే రాజునకు ప్రాణము. ప్రజాభిమానమును చూరగొనజాలనిరాజు జీవించుట వ్యర్థము. ఈ పరమధర్మము శ్రీరామచంద్రుని జీవితమునందు పరిపూర్ణత నందినది. అతడు ప్రజలను ప్రేమించెను. ప్రజారంజనమే అతని ఏకైకలక్ష్యమై యుండెను. ప్రజాసుఖమునకాత డేపనినైనను చేయుటకు సంసిద్ధుడై యుండెను. అతని సమస్త ప్రాణములును, సమస్త సుఖములును, ప్రజారంజనరూపమగు హోమాగ్నియందు ఘృతమువలె ఆహుతియై పోయెను. కేవల ప్రజారంజనము కొరకు నిర్దోషియును, పరమ ప్రేమాస్పదయును పతివ్రతయును, సహధర్మచారిణియునగు భార్యను సహితము పరిత్యజింపగల రాజు ప్రపంచమునందు మరివ్వడైన ఉన్నాడా? ఆమె సంపూర్ణముగ నిర్దోషయని ఎరింగియును, ఆమెయందపూర్వానురాగమున్నను, కేవల ప్రజారంజనము కొరకు ఆమెను వనవాసమునకంపెను. ఇదియే ఆదర్శక్షత్రియునకును, ఆదర్శనరపతికిని లక్షణమైయున్నది.

నిజముగా, అట్టి ప్రజాపాలకుడు, అట్టి ప్రజాహితప్రాణియగు రాజు, ఇప్పుడు భారత దేశమునకు లభించిన యెడల, ఈ భయంకరక్షామములు, ఈ అకాలమృత్యువులు, ఈ రోగములు, ఈఅశాంతి యింతయును ఒకసారిగా శాంతించి,

భారతదేశ మొక నందనకాననమై ప్రకాశింపగలదు. అప్పుడు భారతదేశమెల్ల ఆనందముతో నిండి పోవును. శాంతిరూపిణియగు మందాకిని ప్రవహించి ప్రజల దగ్ధహృదయములకు శాంతిని ప్రసాదించును. భారతీయుల భాగ్యాకాశమునందట్టిశుభనక్షత్ర మెప్పుడుదయించునోకదా?

ఆదర్శ నరపతి యందుండవలసిన లక్షణములే కాక, ఆదర్శ మానవుని యందును, ఆదర్శ గృహస్థునందు నుండవలసిన లక్షణములన్నియు నున్నవి. వాని పితృభక్తి, మాతృభక్తి, భాతృప్రేమ, జితేంద్రియత, ఏకపత్నీవ్రతము, సహనశీలత, ధైర్యము, భక్తవాత్సల్యము, శరణాగతరక్షణ, ఉదారత సచ్చరిత్రత, నిష్కపటప్రేమ, సత్యవాక్య పరిపాలన మొదలగు గుణములన్నియు ప్రతి గృహస్థునకును ఆదర్శ ప్రాయములైయున్నవి. శ్రీరామచంద్రుడెంతటి వర్ణాశ్రమాచార తత్పరుడో తెల్పుట కొక్క నిదర్శనము చాలును. పరశురాముడు యుద్ధమొనర్పవలసినదిగా శ్రీరామచంద్రుని కోరినపుడు శ్రీరాముడిట్లనుచున్నాడు:-

బ్రాహ్మణోఽసీతి పూజ్యోమే విశ్వామిత్ర కృతేనచ
తస్మాచ్ఛక్తో నతేరామ మోక్తుం ప్రాణహరంశరమ్

నీవు బ్రాహ్మణుడవగుటచే నాకుపూజ్యుడవైయున్నావు విశ్వామిత్ర మహర్షియొక్క సంబంధముచేత సహితము నీవు నాకుపూజ్యుడవై యున్నావు- కావున నేను నీపై బాణమును విడువజాలను.

శ్రీరామచంద్రుని ఈ అపూర్వ ఆదర్శములను యథా శక్తి ననుష్ఠించిన యెడల ప్రపంచము ధన్యముకాఁగలదు.

## వానరులెవరు

రామావతారమునందు వానరములు గొప్ప సహాయ మొనర్చి యుండెను. ఆ వానరములెవరు? రామాయణము బాలకాండ 17వ సర్గయందిట్లున్నది:-

పుత్రత్వంతుగతే విష్ణౌ రాజ్ఞస్తస్యమహాత్మనః
ఉవాచదేవతాః సర్వాః స్వయంభూర్భగవానిదమ్॥
సత్యసంధస్య వీరస్య సర్వేషాంనో హితైషిణః
విష్ణోః సహాయాన్ బలినః సృజధ్వంకామరూపిణః॥

విష్ణుభగవానుడు దశరథ పుత్రుడగు శ్రీరామచంద్ర మూర్తి రూపమున అవతరించిన పిదప బ్రహ్మదేవుడు దేవత లందరితోడను "మీరు మీశక్తివలన కామరూపములను సృజించి భగవానునకు సహాయమొనర్పుడని చెప్పెను. బ్రహ్మ యొక్క ఆజ్ఞ ననుసరించి ఇంద్రుడు వాలిని. సూర్యుడు, సుగ్రీవుని, కుబేరుడు గంధమాదనుని విశ్వకర్మ నీలుని, వాయుదేవుడు హనుమంతుని సృజించిరి వీరందరును కామరూపులే సుడీ!

రామాయణము యుద్ధకాండమునందిట్లున్నది:-

తేకృత్వామానుషంరూపం వానరాః కామరూపిణః
కుశలం పర్యపృచ్ఛంస్తే ప్రహృష్టాభరతంతదా॥
నవనాగ సహస్రాణి యయురాస్థాయవానరాః
మానుషం విగ్రహం కృత్వా సర్వాభరణభూషితాః॥

కామరూపులగు వానరములు మనుష్యరూపమునుధరించి భరతుని కుశలమడిగిరి. అనేక భూషణ భూషితులగు వానరులు మనుష్యరూపమునుధరించి తొమ్మిదివేల ఏనుగులపై నెక్కి వెళ్ళిరి. రామాయణము సుందరకాండ ద్వితీయసర్గయం దిట్లున్నది:—

సూర్యేచాస్తంగతే రాత్రౌ దేహంసంక్షిప్యమారుతిః
వృషదం శకమాత్రో౽థ బభూవాద్భుతదర్శనః

సూర్యాస్తమయ మైనపిదప హనుమంతుడు తన శరీరమును చిన్నదిగానొనర్చి పిల్లిరూపమును ధరించెను. ఈ అపూర్వరూపముతో నాతడు రావణుని అంతఃపురమును ప్రవేశించెను. దేవతాస్వరూపులగు వానరులు కామరూపులనుటకీ ప్రమాణములు చాలును.

## వాలినిజంపుట పాడియా?

రాముడు దొంగతనముగా వాలిని చంపెనని కొందరు అధిక్షేపించుచున్నారు కాని వాలిని వధించిన విధానమునం దేమియును దోషములేదు. కారణమేమన:- (1) వానరములు శాఖామృగములు. మృగమును చంపుటయందు క్షత్రియులు యుద్ధనీతిని పాటింపవలసిన అవసరములేదు. కావున శాఖామృగమగు వాలిని రాముడు దాగియుండి బాణముతో కొట్టుట దోషముకాజాలదు. (2) వాలికి ఎదురుగానిల్చుండి యుద్ధమునర్చ దలంచినవానిలోని సగముబలమును వాలి ఆకర్షింపగలడు. కావున యుద్ధనీతిననుసరించి రాముడు దాగియుండియే బాణమును వదలినాడు.

# బలరామ కృష్ణావతారములు

ఇక ౮ వ అవతారము బలరామ, కృష్ణావతారములై యున్నవి. ఇందు బలరాముడు అంశకళావతారమును, శ్రీకృష్ణుడు పూర్ణకళావతారమునై యున్నారు. భాగవతమునం దిట్లున్నది:—

ఏతేచాంశకలాః పుంసఃకృష్ణస్తుభగవాన్ స్వయం

కృష్ణుడుమాత్రమే పూర్ణకళావతారమై యున్నాడు. మిగతా అవతారములన్నియు అంశావతారములై యున్నవి.

ద్వాపర కలియుగ సంధికాలమునందు ప్రపంచమెల్ల పాపభూయిష్టమైపోయెను. ఒకవైపు జరాసంధాధి రాక్షసులు ప్రజలను పీడించుచుండిరి. ఒకవైపు కౌరవులు దుర్మార్గము లొనర్చుచుండిరి. మరియొకవైపు కంసుడు శిశువధ సహిత మాచరించుటకు వెనుదీయకుండెను. అట్టిసమయమున దుష్టులనుశిక్షించి, ధర్మమును స్థాపించుటకొరకు కృష్ణావతారముద్భవించెను పూర్వజన్మయందు, భగవానుని పుత్రునిగా బడయవలయునని తపమొనర్చి దేవకీవసుదేవులకు భగవానుడు పుత్రరూపమున జనించెను. అటులనే కొందరుఋషులు భగవానుని పతిరూపమున దర్శింపవలయునని తపమొనర్చిరి. వారందరును గోపికలై ఉద్భవించినారు. పద్మపురాణము పాతాళఖండమునం దిట్లున్నది:—

మానసేసరసిస్థిత్వా తపస్త్రీవ్రముపేయుపామ్
జపతాం సిద్ధిమంత్రాశ్చధ్యాయతాం హరిమీశ్వరమ్॥

మునీనాం కాంతుతాం నిత్యాంతస్య ఏవపదాంబుజం
ఏకసప్తతి సాహస్రసంఖ్యాతానం మహరాజసామ్॥
తదహం కథయామ్యద్యతద్రహస్యం పరంవన్నే

మానససరోవరమునందు, భగవానుని చరణసేవయందిచ్ఛగలవారై 71 వేలమంది మునులు తీవ్రముగ తపమాచరించిరి. వారు సిద్ధిమంత్రములను జపించుచు, హరిని ధ్యానించిరి. వారిలో ఏమునీశ్వరులు తమశరీర, మనః, ప్రాణ, ఆత్మల ద్వారా భగవానుని తీవ్రముగ వాంఛించిరో వారందరును గోపవంశమునందు గోపీరూపమున జన్మించిరి. ఇటులనే అనేక శ్రుతులుకూడ గోపీరూపమున జన్మించెను. "భవద్భిరంశైర్యదుషూపజన్యతామ్" అని భాగవతమునందు, దేవతలుకూడ యదువంశమునందు జన్మించినట్లు చెప్పబడియున్నది కావున, గోపగోపీ గణమంతయును సామాన్యమానవులు కారనియును. దేవాంశచే జన్మించినవారనియు పాఠకులు తెలిసికొందురుగాక!

## శ్రీకృష్ణావతారప్రశంస

శ్రీకృష్ణావతారమునందు భగవానుడొనర్చిన కార్యములనన్నింటిని ప్రతిహిందువుడును ఎరింగియేయున్నాడు. కావున వానినిగూర్చి వివరింపవలసిన అవసరములేదు. కాని, కొన్ని ముఖ్యవిషయములనుమాత్రమిచట విశదీకరించెదము. భగవానుడు సచ్చిదానంద స్వరూపుడగుటచే ఆతని అవతారమునందు సహితము సత్ భావము, చిత్ భావము, ఆనందభావములను 3 భావములునుండును. సత్ భావమునకు కర్మలతోడను,

చిత్ భావమునకు జ్ఞానముతోడను, ఆనంద భావమునకు భక్తి తోడను సంబంధమున్నది. కావున పూర్ణావతారమునందు కర్మ, జ్ఞాన, భక్తులను 3 లీలలును ప్రదర్శింపబడినవి. ఆతడు పూర్ణకర్మిష్ఠియును, పూర్ణజ్ఞానియును, పూర్ణరసికుడు నైన ప్పటికిని, త్రిగుణాతీతుడగుటచే నిర్లిప్తుడైయుండును. శ్రీకృష్ణుడు పూర్ణావతారమగుటచే ఆతని జీవితమునందు కర్మ, జ్ఞాన, భక్తిభావముల సర్వోత్తమ అలౌకిక ఆదర్శము చక్కగా ప్రదర్శింపబడినది. అంశావతారమునందు అంశకళలు మాత్రి ముండుటచే వానిపనులన్నియు ఏదోఒక ముఖ్యభావమును మాత్రమే ఆశ్రయించియుండును. శ్రీరామచంద్రునియందు మర్యాదాభావమే ముఖ్యమగుటచే సీతాదేవి నిర్దోషియని ఎరింగియును, కేవల వంశమర్యాదా రక్షణముకొరకు ఆమెను వనముల కంపినాడు. కాని పూర్ణావతారము భావాతీతమగుటచే ఏదోఒకభావము నాశ్రయించి కార్యము లొనర్పవలసిన అవసరములేదు. వారు కేవల జగత్కల్యాణము కొరకును, సమిష్టి ధర్మరక్షణముకొరకును కార్యము లొనర్చెదరు. కావుననే ధర్మరాజుచేత అసత్యములను పల్కించి ద్రోణుని చంపించినను శ్రీకృష్ణునకు పాపమురాలేదు. అటులనే ఆతడొనర్చిన అనేక కార్యములను లౌకికదృష్టితో చూచినపుడు చెడుగా కాన్పించినను జగత్కల్యాణదృష్టితో పరిశీలించినపుడుమాత్రము అది సంపూర్ణ నిర్దోషయుక్తములుగనే కాన్పించును. ఇదియే పూర్ణావతారమందలి కర్మరహస్యమై యున్నది. ఇక ఆతని భక్తిగని రహస్యమేమన:- అన్నిరసములలోని భక్తులను

ఆతని విభిన్నలీలలను ఆశ్రయించి తమకు అనుగుణ్యముగ స్వీకరింపవచ్చును. కారణమేమన. ఆతడు పూర్ణావతారమగు టచే ఆతనియం దన్నిరసములును నిండియున్నవి కావుననే ఆతనిభక్తులయం దన్నిరసములవారును ఉన్నారు. పాండవులు సఖ్యరసమందలి భక్తులు! విదురాదులు దాస్యరసమందలి భక్తులు! యశోదాదులు వాత్సల్యరసమందలి భక్తులు! భీష్మా దులు వీరరసమందలి భక్తులు! వ్రజగోపికలు కాంతారసమం దలి భక్తులు!

## శంకా సమాధానములు

ఈ కాంతారసమునందలి రహస్యము లెఱుంగజాలక కొందరుమూఢులు శ్రీకృష్ణుని మహోన్నత చరిత్రముపై కళం కము నారోపింప ప్రయత్నించుచున్నారు. కావున రాసలీలను గురించి కొంచెము వివరించుట సమంజసమని భావించు చున్నాము. శ్రీమద్భాగవతమునం దిట్లున్నది:—

యోగేశ్వరేణ కృష్ణేనతాసాం మధ్యేద్వయోర్ద్వయోః
ప్రవిష్టేన గృహీతానాం కంఠేస్వనికటంస్త్రియః

రాసలీలా సమయమున యోగీశ్వరుడగు శ్రీకృష్ణుడు అనేక శరీరములనుధరించి, ఇద్దరిద్దరు గోపికలమధ్య తాను ఒక్కడొక్కడుగా నిల్చుండెను.

గోపికలు తమతమ యిండ్లనుండి పారిపోయి వచ్చిరి. కావున శ్రీకృష్ణుడు గోపికారూపములను ధరించి, వారిపతులకు అనుమానము కలుగకుండ వారిగృహములయం దుండెను.

గొప్ప యోగియగువాడు తప్ప ఇన్నిరూపములనుధరించి ఇట్లు మెలంగగలడా? కావుననే వేదవ్యాసుడిచట శ్రీకృష్ణుని "యోగీశ్వరు" డని వ్రాసినాడు. కామేశ్వరుడనియో, రతీశ్వరుడనియో వ్రాసియుండలేదు. ఇక ముఖ్యముగ ఆలోచింపవలసిన విషయమేమన, స్వయముగా తానొక్కడే స్త్రీరూపములను పురుషరూపములనుకూడ ధరింపగలిగిన యోగీశ్వరుని యందు కామముద్భవించునా, లేదా, యనునదియే ఆలోచనీయాంశము. తనపై తనకు కామము కలుగదనియు, ఇతరులపై మాత్రమే కామము కలుగుననియు, పాఠకులకందరకును తెలిసియేయున్నది రమించుట యనునది ద్వైతమునందే సంభవించునుకాని అద్వైతమునందు సంభవింపజాలదు. ఆత్మారాముడగు యోగిమాత్రమే తనయందు తాను రమించును. కాముకుడగువాడు ఇతరులతో రమించును. వాడు తనతో రమింపజాలడు. కావున ఒకేకృష్ణుడు స్త్రీరూపమునందును పురుషరూపమునందును అద్వితీయముగ నున్నపుడు, ఆతని యోగస్థితి కామదశకన్న ఉన్నతమై యున్నదని నిస్సందేహముగ చెప్పనగును. భాగవతమునందిట్లు వ్రాయబడియున్నది:-

గోపీనాం తత్పతీనాంచ సర్వేషాం చైవదేహినాం
యోఽన్తశ్చరతి సోఽధ్యక్షః క్రీడనేనేహ దేహభాక్
అనుగ్రహాయ భక్తానాం మానుషం దేహమాశ్రితః
భజతేతాదృశీః క్రీడాయాః శ్రుత్వాతత్పరోభవేత్ ॥

ఏభగవానుడు గోపికలయందును, గోపికల భర్తలయందును నిండియున్నాడో, ఆభగవానుడు శరీరమునుధరించి ఇట్టి

లీల లొనర్చుటకు కేవలము భక్తవాత్సల్యమే కారణమై యున్నది. కావున కృష్ణునియందు కామాదిభావముల నారోపించుట సమంజసముకాదు. వేదవ్యాసుని "యోగీశ్వరేణ కృష్ణేన" అనువాక్యమే దీనిని ఋజువుచేయగలదు.

కాని, స్థూలసంభోగ ద్యోతకములగు భాగవతశ్లోకముల భావమేమని కొందరు ప్రశ్నింపవచ్చును. పూర్వజన్మ యందు భగవానుని సంయోగమునాశించి తపమాచరించిన ఋషులందరును గోపికలై యుద్భవించిరి. వారు శ్రీకృష్ణుని మధురమోహానమూర్తిని దర్శించినపుడు, స్థూలరూపమున వానితో కలియవలయుననెడి కోరిక వారికి కలుగుట స్వాభావికమే యగును. కాని, భాగవతమునందిట్లు చెప్పబడియున్నది:—

నమయ్యావేశిత ధియాంకామః కామాయకల్పతే
భర్జితః క్వథితో ధానః ప్రాయోబీజాయ నేష్యతే॥

భగవానుని యెడ కామభావముతో ప్రీతి కలిగినప్పటికిని, ఆ కామము దగ్ధబీజమువలె అంకురము నుత్పన్నమొనర్పజాలదు. అదియెట్లు సంభవమగునని పరీక్షిత్తు ప్రశ్నింపగా బ్రహ్మర్షియగు శుకుడిట్లనుచున్నాడు: —

కామంక్రోధం భయం స్నేహమైక్యం సౌహృదమేవచ
నిత్యం హరౌ విదధతో యాన్తి తన్మయతాంహితే॥
నచైవం విస్మయః కార్యోభవతా భగవత్యజే
యోగేశ్వరేఽశ్వరే కృష్ణేయత ఏతద్విముచ్యతే॥

కామ, క్రోధ, స్నేహ, భయాది భావములలో ఏదో ఒకదానిద్వారా భక్తుడు భగవానునియందు దాసక్తుడై క్రమ

క్రమముగా తన్మయతనంది, ఆ తన్మయత ద్వారా భగవానుని యందు లవలీనమై, భక్తుడు ముక్తినందుచున్నాడు. గోపికలు సహిత మటులనే పూర్వసంస్కారమునను సరించి శ్రీకృష్ణుని యందాసక్తులై స్థూలసంభోగమును వాంఛించిరి. కాని శ్రీకృష్ణుని అలౌకికశక్తివలన ఆకర్షింపబడి కొలదిసేపటిలోనే తన్మయులయ్యేడివారు. వారు తన్మయులైనపిదప, తమనుతామే మరచినపిదప, మనస్సే నశించినపిదప, మనస్సులోని కామాదులెట్లు నిలువగలవు. ఈవిధముగా తన్మయత ద్వారా, మనస్సును మనోవృత్తులను పోగొట్టుకొని, భగవానునియందు లవలీనులై గోపికలు ఉన్నతగతినందిరి, ఇదియే రాసలీలలోని గూఢరహస్యము.

ఇటులనే వస్త్రాపహరణమును గురించియును కొందరు అనేకవిధముల శంకించుచుందురు. దీనిలోని రహస్యమేమన, గోపికలు శ్రీకృష్ణుని పతిగా పొందవలయుననెడి తలంపుతో కాత్యాయనీవ్రత మాచరింపుచుండిరి. భాగవతమునం దిట్లున్నది:—

"నందగోపసుతం దేవి పతిం మే కురు తేనమః"

తల్లీ! కాత్యాయనీ! నందకుమారుడగు శ్రీకృష్ణుని నా యొక్కభర్తగా అనుగ్రహింపుము; నేనునీకు నమస్కరింపుచున్నాను.

శ్రీకృష్ణుడు పరమాత్మయగుటచే, పరమాత్మనుపొందుటకెన్ని యోగ్యతలుండవలయునో అన్నియోగ్యతలును లేని

మొదల శ్రీకృష్ణుడు వారికి భర్త కాజాలడు. కావున, వస్త్రాపహరణముద్వారా శ్రీకృష్ణుడు గోపికల యోగ్యతను పరీక్షించి యున్నాడు. జీవునకు శరీరముపై అభిమాన మున్నంతవరకును పరమాత్మను పొందజాలడనుట శాస్త్రీయసిద్ధాంతమైయున్నది కామ, భయ, లజ్జాదులు శరీరముపై అభిమాన మున్నంతవరకును మనుష్యుని ఆశ్రయించి యుండును. కాని, బాలునియందు కామములేదు; కావుననే దిగంబరిగ నుండుటకు బాలుడు సిగ్గుపడుటలేదు. అటులనే పరమహంసలగు మహాత్ములు సహితము పరమాత్మనుపొంది శరీరాభిమానమును తొలగింపుకొనుచున్నారు కావున వారుగూడ నగ్నముగనే తిరుగుచున్నారు. ఎంతవరకిట్టిస్థితి లభించదో, అంతవరకును కామక్రోధాదులు వీడజాలవు; అంతవరకును పరమాత్మ లభింపదు; అంతవరకును వస్త్రములతో తనసిగ్గును కాపాడుకొను చుండవలయును. గోపికలు పరమాత్మను పొందవలయునని వాంఛించుచుండిరి. కాని వారికి దేహాభిమానము మాత్రము నశింపలేదు ఈ విషయమునే శ్రీకృష్ణుడు "వస్త్రాపహరణము" ద్వారా స్పష్టీకరించెను ఎంతవరకు దిగంబరిగ నుండుటకు సిగ్గుపడుదురో అంతవరకును పరమాత్మ లభింపజాలడని ప్రబోధించెను. ఈ విధముగా కృష్ణునియందు భక్తిలోని స్నిరసములును సంపూర్ణత నందినవి. ఇక ఆతని జీవనమునందు జ్ఞానమెట్లు పూర్ణత్వమందెనో, కొంచెము గీతాశాస్త్రమును పరిశీలించినమొదల తెలియగలదు.

పురుషధర్మవిజ్ఞానము, రాజధర్మవిజ్ఞానము, సమాజనీతి విజ్ఞానము, సాధారణధర్మవిజ్ఞానము, ఆపద్ధర్మవిజ్ఞానము, ధర్మ యుద్ధనీతివిజ్ఞానము, వర్ణాశ్రమధర్మవిజ్ఞానము, మొదలగు జ్ఞాన కాండయందలి అన్నిఆగములును లీలావిగ్రహుడగు భగవానుని కథలవలనను, ఉపదేశములవలనను చక్కగ గ్రహింపవచ్చును. ఇదియే శ్రీకృష్ణుని జ్ఞానమయ జీవితమందలి అపూర్వ ఆదర్శమైయున్నది. కావున పూర్ణావతారమగు శ్రీకృష్ణుని యందు కర్మ, ఉపాసనా, జ్ఞానములు సామంజస్యమునందినవి.

## బుద్ధావతారము

ఇక 9 వ అవతారము బుద్ధావతారము. శ్రీమద్భాగవతమునందిట్లు వ్రాయబడియున్నది:—

తతఃకలౌ సంప్రవృత్తే సమ్మోహాయ సురద్విషామ్
బుద్ధో నామాంజనసుతః కీకటేషు భవిష్యతి॥

బుద్ధావతారము కలియుగమునందవతరించినది. కీకట ప్రదేశము (ఇప్పటి గోరఖ్‌పుర్ జిల్లా) నందు శుద్ధోదనునకు పుత్రుడై బుద్ధభగవానుడుదయించెను.

బుద్ధావతారముదయించుటకుపూర్వము ప్రపంచమంతయు అల్లకల్లోలముగ నుండెను. జ్ఞానహీనమగు కర్మకాండయును, ఉపాసనయును విపరీతము వ్యాపించెను. మూర్ఖులగువారు వైదికయజ్ఞములను పేరుతో లక్షలకొలది పశువులను వధించుచుండిరి నరబలులుసహిత మొసంగబడుచుండెను. జీవహత్య పెరిగిపోవుటచే ధర్మమునకు గ్లానిసంభవించెను. ఆసుర

భావము వృద్ధినందెను. అప్పుడు బుద్ధభగవాను డవతరించి, ఘోరమగు పశుహత్యలను ఆపి, రాక్షసభావమును నాశన మొనర్చెను. బుద్ధుడు భగవదవతారమైనను, వేదవిరోధమగు మతమును స్థాపించుట కొక కారణమున్నది! అంశావతారమం దలి కార్యములన్నియు దేశకాలముల ననుసరించి యుండు ననియు, వారుస్థాపించిన ధర్మము ఏకదేశీయమగుటచే, అది పరివర్తనశీలమై యుండుననియు ఇంతకుకి్రతమే మనవి జేసి యున్నాము. దేవుని పేరిట జరుగుచున్న అత్యాచారముల నాపు టకు బుద్ధుడప్పు డట్టిమతమునే స్థాపింపవలసియుండెను. అంత కన్న గత్యంతరమేమియును లేదు. విషము ప్రాణాపద్రకర మగు వస్తువైనను, కఠినరోగగ్రస్తునకు విషమునుకూడ ఔషధ రూపమున త్రాగించినట్లే, బుద్ధావతారకాలమందలి జీవహత్యా రూపమగు భయంకర జాతీయరోగమును నాశనమొనర్చుటకు నాస్తికతయను విషమును బుద్ధుడు ప్రయోగింపవలసి వచ్చెను. దీనివలన ఆతడు ఆసమయమునందు జీవహత్యారూపమగు పాపమునుతొలగించి జ్ఞానమూలకమగు బౌద్ధధర్మమును వ్యాపిం పజేసెను కాని రోగావస్థయందు పుచ్చుకోవలసిన విషమును ఆరోగ్యావస్థయందు సేవించినయెడల ప్రాణాపద్రకరమైన ట్లునే, ఈ నాస్తికధర్మము తాత్కాలికముగ ఫలవంతమైనను క్రమక్రమముగ భయంకరరూపమును ధరించి పాపమును వృద్ధి జేయదొడంగును. అప్పుడు భగవానుడగు శంకరుని కళవలన అంశావతారముగ శంకరాచార్యు డవతరించి, తన ప్రచండ

శాంకరీ ప్రతాపమువలన భారతదేశమునందు బౌద్ధధర్మమును అణచివైచి వైదికధర్మమును పునఃప్రతిష్ఠిత మొనర్చెను.

## కల్క్యవతారము

ఇక 10 వ అవతారము కల్కి అవతారము. ఈ అవతారమింకను ఆవిర్భవింపలేదు. కలియుగము 4 లక్షల 32 వేల సంవత్సరముల పరిమాణము గలిగియున్నది. అందిప్పటికి 5 వేల సంవత్సరములుమాత్రమే గడచినవి. కావున కల్కి అవతారముద్భవించుటకింకను చాలకాలము గడువవలసి యున్నది. ఇంకను ధర్మమునకు సంపూర్ణముగా గ్లాని సంభవింపలేదు. అనేకవిధములగు భగవద్విభూతులవలనను, ఆవేశావతారముల వలనను, ఋషులవలనను కొంతవరకు ధర్మము కాపాడబడుచునే యున్నది. కావున ఇప్పుడే భగవంతుడవతరింపవలసిన ఆవశ్యకత కలుగలేదు. ఆ అవతారముద్భవించెడి సమయమునందు దేశకాలపరిస్థితు లెట్లుండునో ఆవిషయమంతయును శ్రీమద్భాగవతాది గ్రంథములయందు స్పష్టముగ వివరింపబడియున్నది అప్పుడు ప్రపంచమంతయును మహాపాపభూయిష్ఠమై యుండును. మనుష్యులందరును ధర్మచ్యుతులగుదురు. రాజులు ప్రజాపీడన మొనర్చెదరు. మ్లేచ్ఛులకు రాజ్యాధికారము లభించును. అపుడు కల్కి అవతారముద్భవించి మ్లేచ్ఛులను, పాపులను నాశనమొనర్చి పుణ్యాత్ములను రక్షించును. ఆతడవతరించినపిదప మరల సత్యయుగము ప్రారంభించి ధర్మము వ్యాపించును. ఇదియే అంశావతార, పూర్ణావతారముల సంక్షిప్త వివరణమై యున్నది.

ఈ అంశావతార పూర్ణావతారములే కాక, ఇంకను 3 విధములగు అవతారములున్నవని ఇంతకుక్రితమే చెప్పియున్నాము.

"నిమిత్తాద్ విశేషా విశేషా"
"అంతరావిర్భావ నిత్యత్వం"

ఏదేని ఒక నిమిత్తమువలన విశేష, అవిశేషావతారము లుద్భవించును. అంతఃకరణమునందు భగవానుని నిత్యావతార ముండును. విశేషావతారమునే ఆవేశావతారమనికూడ చెప్పెదరు. పద్మపురాణ ప్రమాణమును చూడుడు:—

"ఆవిష్టోఽభూత్ కుమారేషునారదే చహరిర్విభుః"
"ఆవివేశపృథుందేవః శంఖీ చక్రీ చతుర్భుజః"

భగవానుడు సనత్కుమారాది మునులయందును, నారదాదులయందును, పృథునందును ఆవిష్టుడైయున్నాడు. కావున వీరందరును అవేశావతారములు. ఒక్కొక్కపుడు భగవద్భావ మావేశించి, అన్యసమయములయందు ప్రాకృతజనము వలె నుండెడివారే అంశావతారము లనబడుదురు. ఇదియే శాస్త్రోక్తమగు విశేష, అవిశేషావతార రహస్యమైయున్నది. దీక్షనొసంగునపుడు గురువులో అవిశేషావతారమే ప్రకటమగును. గురువు సాక్షాత్తు భగవంతుడని ఆర్యశాస్త్రముల యందు చెప్పబడియున్నది. భగవానుడు నిరాకారుడగుటచే, మనుష్యునకు ప్రత్యక్షసంబంధమును కలిగియుండజాలడు. కావున "గురువు" అను మనురూపమగు కేంద్రముద్వారా

భగవంతుడు తన జ్ఞానశక్తిని ప్రకటమొనర్చి, శిష్యుని తన వైపు ఆకర్షించును.

ఈవిధముగా విశేష, అవిశేషావతారములవలన అధర్మ నాశనమును, ధర్మోన్నతియును జరుగుచుండును.

సర్వవ్యాపియును, సర్వశక్తిమంతుడును, జ్ఞానమయుడు నగు పరమాత్మ సర్వాంతర్యామి యగుటచే ప్రతిజీవియొక్క హృదయమునందును విరాజమానుడై యున్నాడు. ఆ హృదయాసనమునందుండియే భగవానుడు జీవులను పాపకర్మము నుండి మరల్చును. పుణ్యకర్మములవైపు చిత్తవృత్తిని ప్రేరేపించుచు, జీవుడు అధోగతి నందకుండ కాపాడుచుండును. దీనికే నిత్యావతారమని పేరు. పైన ఉదహరించిన పూర్ణ కళావతార, అంశావతారములకువలెనే, ఈ యవతారముల యందు సహితము కళలలో వ్యత్యాసముండును. ఉదాహరణముగా:- ఆవేశావతారమగు చైతన్యునకును, నారదునకును చాల వ్యత్యాసముండును. కారణమేమన, భగవానుడు నారదుని ఆవేశించినసమయమున షోడశకళలతో ఆవేశింపవచ్చును. అటులనే గురువునందును సంభవింపవచ్చును. అటులనే నిత్యావతారమునందు సహితము విభిన్నవ్యక్తులయందు వ్యత్యాసము లుండవచ్చును. ఒకనియందు యంతరాత్మ పాపకార్యము లొనర్పవలదని బోధించుచున్నను వాడు వినకపోవచ్చును. మరియొకడు క్రమక్రమముగా భగవానుని ప్రబోధమును స్వీకరించి ఉన్నతి నందవచ్చును. సామాన్యమానవునికన్న శరునజ్ఞుడగు వాని యందెక్కువ కళలుండును. వానికంటెను భక్తునియందు

ఎక్కువ కళలుండును. వానికన్నను పూర్ణజ్ఞానియగు జీవన్ముక్తునియందు ఎక్కువకళలుండును. ఇదియే సర్వశక్తిమంతుడును, షోడశకళాపూర్ణుడునగు భగవానుని 5 విధములగు యవతారములలోని తత్త్వమైయున్నది భగవచ్ఛక్తియొక్క వికాస కేంద్రము లగుటచే వీరందరును పూజ్యులైయున్నారు. కావున "అవతారోపాసన" నవధా విభక్త ఉపాసనలోని ఒకప్రధానాంగమై యున్నది. కాన నీపైవిషయములను గుర్తెరింగి భగవదవతారములను నిందింపక యుపాసించి యైహికాముష్మిక సుఖంబులం బొందెదరుగాక !

అవతారమీమాంస సంపూర్ణము.



దివ్యవాణీ పత్రికవారి
శ్రీనివాసా ప్రింటింగ్ వర్క్సు, సికింద్రాబాద్ (దక్కన్)